ఉన్నంతవరకూ ఒకదమ్మిడీ అయినా ఖర్చుపెట్టనివ్వ లేదు. ఆమె పోయిన తరవాత, అప్పటికే పన్నెండేళ్ల పిల్ల కూతురికి పెళ్లి చేసేసు. తరవాత నాలుగయిదేళ్ళలో దురదృష్ట వశాత్తు, ఆమెకు వైధవ్యం ప్రాప్తిస్తే అదంతా శంకరశాస్త్రుల్లు ముసలివాడికిచ్చి పెళ్లిచేసిన కక్కుర్తి ఫలితమే అంటారు కొందరు అయినా వాళ్లకి అసలు విషయమేమిటో కావలిస్తే కదూ, తమంటే కిట్టక ఏదో అలా అంటారంతే

కూతురు తిరిగి వచ్చిన తరవాత ఒక ఏడాది పాటు బాగానే ఉంది తన స్థితికి తగినట్టుగా తరవాత కాశీయాత్రకి వెళ్తానంది ఒక వారంరోజులు పాటు ఆలోచించి, ఇక దానికి ఐహిక జీవితంలో మరేమీ అవలంబనం లేదు, ఎప్పటి కయినా ఆముష్మికం చూసుకోవలసినదే కదా అని, వచ్చిచ్చి తగిన పెద్దవాళ్లతో కలిపి పంపాడు ఆ వెళ్లడం కూతురు ఎవరితోనో లేచిపోయిందనీ, యాత్ర అన్నది కేవలం ఒక మిష అనీ, తెలిసింది 'సరే, దాని మొగుడితోపాటు అదీ పోయిందనేసు కొంటా' నన్నాడు శంకరశాస్త్రుల్లు

ఇప్పుడు బాగా పెద్దవాడయి పోవడంచేత ఎక్కడికీ కదలలేడు ఎప్పుడూ ఇంట్లోనే ఉంటాడు, ఉంటాడంటే ఊరికే గోళ్లు గిల్లుకొంటూ కూర్చుంటాడా? పెరట్లో అన్నిరకాల కాయగూరలూ పండిస్తాడు. తనకు ఎక్కువయినవి అమ్మేస్తాడు, ఓపికగా బియ్యపుగింజలు ఒక్కొక్కటే ఏరుకొని, వండుకొని, భోంచేస్తాడు, ఒక్కపూటే రెండవ పూట ఏదో ఒక పండుతిని కొద్దిగా మజ్జిగ తాగుతాడంతే.

ఇప్పుడు మునపటి ఆ వసూలు చేసుకోలే ఓపికా, జ్ఞాపకశక్తి తగ్గిపోవడంవల్ల, కేవలం బంగారం వెండి వస్తువులమీద తప్ప డబ్బు ఇవ్వడం మానుకొన్నాడు అతని దగ్గర డబ్బు తీసుకొని వెళ్ళిన ప్రతివాళ్ళూ అంటూ ఉంటారు. "ఇంత ముసలివాడయేడు. నా అన్నవాళ్లెవరూ లేరుకదా ఎందుకింత డబ్బు కక్కుర్తి చెప్మా?" అని కాని, ఆ కక్కుర్తివల్లనే, తనకు ఆమాత్రం అప్పు ఇయ్యగలపాటి డబ్బు చేరిందనీ, అతడు అందరిలాగే సామాన్యమయిన జీవితం గడిపి ఉంటే, అందరికంటే దరిద్రుడుగానే ఉండునని గ్రహించరు

అతని జీవిత వివరాలు తెలుసుకొన్న తరవాత అతన్ని చూసి ఎలా ఈర్ష్యపడను? మళ్లీ నా జీవితమంతా మొదటనుండీ బ్రతకడానికి సావకాశం ఉన్నా, అతని జీవితం వంటిది ముమ్మాటికీ నాకక్కరలేదు నాకేకాదు, చాలామందికి అలాగే ఉంటుందను కొంటాను

అసలిలో పట్టిన తేనెపట్టు ఎవరికీ లభ్యం కాకుండా పోతున్నదే అనుకొంటే ఎంత ఫలితమో, అతని డబ్బు ఎవరికీ కాకుండా పోతున్నదే అనుకొన్నా అంతే ఫలితం అయితే తేనె పట్టులోని తేనెను సమకూర్చడానికి తేనెటీగలన్నీ కలిసి పడ్డ కంటే ఎక్కువే కష్టపడ్డాడుగాని తక్కువ పడలేదు దానిని సంపాదించడానికి అటువంటి శంకరశాస్త్రుల్లును చూసి ఈర్ష్యపడడం దేనికి? ఇంతకీ అతని ఆస్తంతా మహా ఉంటే ఒకటిన్నర లక్షలు ఆ మాత్రం మొత్తాన్ని అవలీలగా ఏమీ లక్ష్యంలేకుండా ఖర్చుపెట్టే శ్రీమంతులున్న మన వ్యావహారిక జగత్తులో అతన్ని గురించి అంతగా అనుకోడం ధర్మం కాదు కాని, భూగర్భంలో నిక్షిప్తమయి ఉన్న అమూల్యమయిన ఖనిజాల గురించి కలగని ఆలోచన తేనెపట్టును చూసే సరికల్లా కలుగుతుంది ఎలా దీన్ని సంపాదించడమా? దీనిలో ఏ మాత్రం తేనె ఉంటుందా? అని

లోకులు, నాతోపాటు ఎవరేమనుకొన్నా సరే శంకరశాస్త్రుల్లుగారు మాత్రం సంకల్ప సిద్ధుడు. ఆ తృప్తే లేకపోతే ఆయన ఇన్నాళ్ళు బ్రతకనే లేకపోయేవాడు

---

# యజ్ఞఫలము

### భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

## శ్రీ బులుసు వెంకటేశ్వరులు

[భాసమహాకవి సంస్కృతములో నిరువదిమూడు నాటకములు వ్రాసినాడని యందు "కిరణావళి" "మకుటతాడితకము" "ఉదాత్తరాఘవము" మున్నగునవి కలవని శ్రీ ఆర్. వి. కృష్ణమాచారిగారు వ్రాసిరి. ఇటీవలనే రాజవైద్య జీవరామకాళిదాసశాస్త్రి గారు "యజ్ఞఫల"మను ఈనాటకమును సంపాదించి ప్రకటించి యిది భాసమహాకవికృతమే యని నిరూపించియున్నారు. ఈ యభిప్రాయమును విమర్శకాగ్రేసరులగు డాక్టరు. పుసలేకర్, ప్రొఫెసరు సిన్హా మున్నగువారు విపుల విమర్శతో దీనిని బలపఱచియున్నారు. ఈ విషయములెల్ల ప్రత్యేకవ్యాసమున నిరూపితమగును. ఇంతవఱకీ నాటకమేభాషలోనికి ననువదింపబడలేదు ఈ తెలుఁగుసేతయే ప్రప్రథమ భాషాంతరీకరణము ]

### ఇందలి పాత్రలు

సూత్రధారుఁడు
సుమంత్రుఁడు
కాంచుకీయుఁడు
విదూషకుఁడు
చిత్రకేతుఁడు, చిత్రపథుఁడు } గంధర్వులు
రావణుఁడు
మాళవకుఁడు, భవకుడు, దంతిలుఁడు, గోపలుఁడు } వైతాళికులు
దేవతలు
గంధర్వులు
రాక్షసులు

దశరథుఁడు [రాజు]
విశ్వామిత్రుఁడు
వసిష్ఠుఁడు
రాముఁడు, భరతుఁడు, లక్ష్మణుఁడు, శత్రుఘ్నుఁడు } కుమారులు
జనకుఁడు
పరశురాముఁడు

నటి
విజయ
చేటి
మంథర
కౌసల్య, సుమిత్ర, కైకేయి } రాణులు
మధురిక, చతురిక, పుష్పతిక, చంద్రరేఖ } సీత చెలికత్తెలు
సీత, మాండవి, ఊర్మిళ, శ్రుతకీర్తి } వధువులు

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును)

సూత్ర

"శ్రీరాముండు కృపాళుతా భరత
సుశ్రీమంజులా కారుడున్
దాశరథి శుభలక్ష్మణ ప్రథితుడున్
శత్రుఘ్న వీరుండు వి
స్తార ప్రాభవ మాని చంద్ర కృత
యజ్ఞ త్రాత, కోదండ శా
స్త్రా రూఢుండు ప్రసన్నమూర్తి
నిరతోత్సాహుండు మిమ్ము గాచుతన్."

(తెరవంక జూచి) ఆర్యా! ఒకసారి యిటు రమ్ము.

నటి (ప్రవేశించి) ఆర్యపుత్రా! వచ్చితిని ఏమి పని?

సూత్ర ఆర్యా! ఈ సభాసదులు మనము ప్రయోగించు నాటకము చూడ గోరుచున్నారు. వీరి సంతోషము కొఱకై వసంతఋతువునుగూర్చి యొక పాట పాడుము.

నటి సరే (పాడును)

పాట

"క్రొంజివుళ్ళ చేత మిగుల గోములంబులౌ లతల్
మంజులంబులైన తియ్య మామిడిగా సుగంధముల్
రంజకంబు లిట్టి తోట రక్తి నెందుచుండగన్
పంజవేళ మల్లెపూలు పరసమాడు నవ్వులన్"

సూత్ర : బాగు బాగు నీ పాటవలన నందఱు సంతోషించుచున్నారు

(తెరలో) "ఏమి! అందఱు సంతోషించు చున్నారు గదా!"

సూత్ర (విని) ఓహో!

"పుత్రజన నోత్సవంబున భూవిభుండు
తనర, ఋత్విగ్వదాన్య సత్కారములను
వారు లెల్లర సంతోషపఱచి యిదటె
ఇదె సుమంత్రుడు విచ్చేసె, పద లతాంగి!"

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

## ప్రథమాంకము

(ప్రవేశము : సుమంత్రుడు)

సుమం ఏమి! అందఱు సంతోషించు చున్నారుగదా!

"పౌరులు తుష్టులైరి మఱి
బ్రాహ్మణు లెల్ల రభీప్సితార్థని
స్తార సుఖాబ్ధి దేలిరి, మోదంబున
శ్రోత్రియపుంగవుల్ సదా
చారులు సత్తమప్రకృతులు సంయము
లందరి తృప్తి సర్వన
త్కారపరంపరన్, దలప
గామ్యము తీరనివార లే రికన్"

కంచుకి (ప్రవేశించి) అమాత్యా! పురజను లను జానపదులను సంయములను సర్వజనములను సర్వవాంఛాపరితృప్తుల నొనరింపు మని నీకు మహారాజాజ్ఞయైనది ఏయొక్కడైనను పెట్టికోరిక కోరినను దీరనివా డుండరాదని మఱి మఱి నొక్కి చెప్పిరి

సుమం మహారాజుమనసు తెలిసి నే నే సర్వము నొనరించితిని.

కంచు మంచిది సుమంత్రా! మంచిది

"జనపతియాంతరవ్యాపయుం
బు నెఱింగి యమాత్యపుంగవుండు శుభంబుల్
పొనరింప ధర్మసంగతి
గను నపవర్గంబు బరమకల్యాణంబున్"

మఱియు, పెద్దపెద్ద రదపెదట నేయోకోర గములచే బద్ధులైయున్నను వారివారి నెల్లర విడిపింపు మని రాజాజ్ఞ

సుమం. బద్ధు లెవ రున్నారు?

"దొంగలు లేరు రాజ్యమున
దుష్టులు లేదను లమ్మవారల
న్యాంగన గోరువారు మఱి
వాసనవారును ద్యూతకారు లె
న్నంగనరారు ముందున కనంగ,
బిత్యాగసుబద్ధుడౌ నృపుం
డంగనలం సురూపకుల నంది
గడించెను దద్యుమత్తతన్"

విదూ (ప్రవేశించి) మహారాజుగారి పుత్రకామేష్టిఫల మిప్పుడే సఫలమైనది ఇప్పట్లు నేను మోదకములు మెక్కుటలో నాజరముకై నేనూ త్రము దయమాపలేదు ఇటువంటి యజ్ఞములు చాలు గానవా నే నప్రతిరథుడ నగు మోదకస్వేరి వసుధును నావంటి విప్రులు భోజనము చేసి తుష్టులగుబోతే యజ్ఞకర్మ సఫలము కాదు

సుమం ఓయీ! సుందరకా! నీకు సువర్ణము చాలినంత లభించినదా?

విదూ ఏమి? నేను సువర్ణమును దినను త్రాగను ముట్టను బంగారము ప్రియముగుటకు నేను రాజు ననుకుంటివా కోమటి ననుకొంటివా?

కంచు ఓ మహాబ్రాహ్మణా! మఱి నీకేది ప్రియము?

విదూ మోదక భోజనము

కంచు నీ వెన్ని మోదకములు తినగలవు?

విదూ మహారథుడగు మహారాజెంతమంది శత్రువులను జంపగలడో యన్ని

కంచు పదివేలమంది శత్రువులను జయింప గలవాడే మహారథుడు

విదూ నేను పదివేల మోదకములను దినగల మహారథుడను

కంచు ఏమి? ఒక్కదినమున నీవు పదివేల మోదకములు తినగలవా?

విదూ ఏమి? ఒక్కదినములో మహారథుడు పదివేలమంది శత్రువులను జంపగలడా?

కంచు పదివేలమందిలో గొంతమంది చనిపోవుదురు కొంతమంది పాఱిపోదురు. కొంతమంది చెల్లాచెదరగుదురు. కొంతమంది శరణుచొత్తురు. వీరిని మహారథుడు రక్షించును

విదూ నేనును గొన్ని మోదకములను మ్రింగుదును కొన్నిటిని చెదరగొట్టుదును కొన్నిటిని జేబుల గొట్టుదును. కొన్నిటిని దయతో రక్షింతును

సుమం బ్రాహ్మణా! వైతండికుడను హేతువాదమున గొప్పవాడవు. నీతో నేమి? నేను నా పని చేసికొని మహారాజా జ్ఞ నందింప నేగుదును (ముందు చూచి) ఓహో! పరిజనుడై మహారాజటకే వచ్చుచున్నాడు.

కంచు' నేను పావనినై పోవుదును. (నిష్క్రమించును)

విదూ: నేను తినగా మిగిలిన మోదకములను దామకోసమటకై పోదును (నిష్క్రమించును)

సుమం: ఆహా! మహారాజా వార్ధకదశయందైన నెంత రమణీయాకృతిలో నొప్పుచున్నాడు! నిత్యము రాజకార్యముల నిర్వహించుచున్నను నాతడు నిత్య ప్రసన్నుడుగనే యుండును

"సతతకలితంబు లొక్కరుని జల్పును,
జూచుకొమన్ స్వకార్యముల్
వివిగము లొక్కవంక, నరి
వీరుల నుక్కడగించు నొక్కటన్
మిత్రులగ దన్పునొక్కటను మిత్రుల,
నొక్కెడ చేటకేశు, ని
ట్లవిరళ కార్యభారమున నందడు
దుఃఖ మొకింతయేనియున్
తరుణ వయస్కువట్లు సతతంబు
నొనర్చును స్వీయధర్మముల్
పరిణతి నందినన్ వయసు పాయదు
తేజము రాజచంద్రునిన్
వరవరచంద్రు పేరు వినినన్ గనినన్
జనకుల్ రతంతయేన్
గురితముతంక బోరు, వినతుర్వ
కలాపము లొక్క వ్రేల్మిడిన్"

(సపరివారముగా రాజా ప్రవేశించును)

రాజా

"కిప్పుడయ మింతయేనియు
గర్రితిని లేదు, సమస్త మానవుల్
విపుల వయార్థ సంపదల
విశ్రుతి గాంచిరి, అన్యవస్తుడు
కృపలత గాంచువారును
రుజాధరతన్ విలపించు వారలున్
నపటను జూపువారును
వకాలమృతిన్ గనువారు లేరిటన్"

"అకాలవర్షంబు గురియు మేఘంబు లెపుడు
ఈతిబాధలు లేక సస్యేందిర కృషి
ఫల మనంత మొసంగును అలఘుపుణ్య
కలిత దైవాన కల్యాణము కలుగబట్టి"

"వేద మధీతమయ్యె, రిపువీరులు
భ్రమ్మిరి, భూప్రజల్ సుఖా
పాదితులైరి స్వీయపరిపాలన
మందున బోలె, నెవ్వరె
య్యది మనంబులన్ దలచి రెల్లర
కయ్యది చేసితిన్, మహిం
జేది యొనర్పగా వలయు నిప్పుడు
నేను మహీజనార్థమై"

"జేవతలున్ బితరులు భూ
దేవతలున్ శరణుగోరు దీనులు నార్తుల్
వివిధముల బూజితు లగు
చే విధి కంక్రవతంబు నిష్ఠను బాయున్"

"పుత్ర జననంబుచేత సంప్రాప్తమయ్యె
మన్మనోరథ మహిత సమ్యగ్వ్య ఫలము,
ఇంతకంటె మన్మనోభీప్సితంబు
లేదు లేశోంతయు; సంతుష్టి లేదు వేఱె"

సుమం (సమీపించి) మహారాజా! జయము

"ప్రజల పాలింప యోగ్యు లాత్మజుల గాంచి
యాత్మభారంబు వారిపై నునుపు పటుప
హృదయభారంబు తొలగిపోయెనుగదా! నృ
పాలచంద్రమ! సంతృప్తి పైకొనె గద!"

రాజా: సుమంత్రా! నిజమే నీవు వెంటనే సర్వార్థిజనమును సఫలాశాచిత్తుల గావింపుము

సుమం: మహారాజా! కావించితిని

రాజా: శ్రోత్రియులను గోహిరణ్య దానములచే సంతోషపెట్టుము

సుమం: మహారాజా! సంతోషపెట్టితిని

రాజా: కారాగృహబద్ధు లగువారి నెల్లర విడిపింపుము

సుమం: మహారాజా!

"ధర్మపరిపాలనంబున ధరణిజనుల
రాజవై నీవు పాలించి రాజిలంగ
స్వర్గసౌఖ్యము లంది యొప్పార జనులు
బద్ధు లెవ్వగు? దుఃఖసంబద్ధు లెవరు?"

రాజా

"పూర్వపుణ్యంబునన్ రాజ్యభూమి పరమ
విస్తృతంబయ్యె, నింతటి విపులభూమి
ధర్మహీనుండు బంధనదండనమున
కర్హుడైనట్టి వాడొకండైన లేడె?"

సుమం

"రాజసింహుండవై నీవు రాజ్య మేల
దుష్కృతం బొనరింపగా దొడగు నెవడు?
మార్గమును నిరభ్ర గగనాన శోభిలంగ
దారి కడ్డము వచ్చునే తమము తలప"

"ఇంతకు బద్ధులైన నరు లెవ్వరు
లేరిక నుంచ బోరు భూ
కాంతుడ! బద్ధమోక్షణము కల్గు
ప్రశంసయు లేదు చూడ నా
వంతయు, ద్వత్ప్రత్యాణపరిబద్ధుడ
నొక్కడ నీవ, కాని నీ
వంతము సేసికొంటి వదె యార్య!
సుపుత్రమహోదయంబునన్."

రాజా: ఓహో నిజమే పితరులఋణము తీర్చుకొంటిని కాని, మతియొక దృఢతరబంధమే నాకు

రాజు (నవ్వి)
పంచమహా యజ్ఞంబుల
నెంచన్ విప్రుండు పదము నీ రెండిటిలో
మించెదరు మీరు నట్లే
ఎంచబడగ నేల నీకొలంత వయస్యా!

విదూ: ఆయుసుర లేరు ఉన్న నీ మాటకారి తనము తెలిసిపోయెడిదే (ప్రకాశముగా) కొడుకులు పుట్టినదినమన్న యుత్సాహముతో నీ వాకలి నైతము మఱచితివి సూర్యు డస్తమించుచున్నాడు చూడుము

రాజు ఓహో! సంధ్యాకాలము సమీపించినది.

కిరణములనంగు వృక్షముల జ
యన్యన బక్షులు చేరి కూసెడున్
గిరణములన్ సతిస్థలిని నిం
పెడు సర్వకళాంబు డిప్పుడే,
చరమ నగంబునన్ దినదినాంపతి
గ్రక్కును గాంతిపుంజముల్,
పరగు బ్రకాశమున్ రజని
భర్త ముఖామల భూషణంబునన్
మఱియు
హిమకరు తేసుదించి గగనం
బిరకున్ గనుపించు నట్టుగా
విమల సరోజసత్కుముద విశ్రుత
మిత్ర పరీవృతుండు ను
త్తము బహురాజ సంయుత యథార్థ
సుశాసియు రాట ను
త్తము దగురాజునా బరగు దత్త
దమూన విధాన కర్మలన్
(నిష్క్రమింతురు)
ఇది ప్రథమాంకము

## విష్కంభము

(ప్రవేశము కాంచుకీయుడు)

కాంచు మహారాజా నా కిట్లాజ్ఞాపించెను "ఓ బాభ్రవ్యా! ధారాగృహముకడ నున్న గ్రీష్మోద్యానమున కేగి యచట బరిజను లెవ్వరు నుండరాదని యాజ్ఞాపింపుము" మహారాజటకు విహారమునకు వచ్చును. రాణులు నందురు పరిజను లుండరాదని యేల యానతో! ఏదైన రహస్యాలోచనము గలదా? రాణులతో గూడి రహస్యవిహారము మహా చెప్పు డును జేసియుండలేదే! నా కిగొడవ యేల? నన్నేమి చేయుమన్న నదియే చేయుదును.

"రాజుల చేష్టలన్నియు గరంబు
దలంప విగూఢ భావవి
భ్రాజితముల్, సుమంత్రులను గ్రాహ్యము
లన్యుల కట్లుగా నవే
యోజన కంక చేసినను నెవ్విధి
నెల్లడిచేయ దోషమౌ;
భ్రాజితబుద్ధి కన్నులను మాసికొనెద
దలపోయ గృత్యమౌ"

(అంత, చేటికలు ప్రవేశింతురు)

ఒక చేటిక ఆర్యా! నలుగురు కుమారులకు నాలుగు కుసుమ జవనికలను మేము సూత్ర మక్కలు లేకయే తయారుచేయుచున్నాము

కాంచు మంచిదే కాని, మఱియొక యుద్యానమున కేగి మీ కోరిక తీర్చుకొనుడు

మఱియొక చేటిక ఆర్యా! ఇంకొక యుద్యానమున విన్నిరంగులు నింత పరిమళము కలిగిన పువ్వు అధికముగా లభింపవు

కాంచు నన నే నేమి చేయగలను? ఇపు డెవరు నిట నుండరాదని మహారాజాజ్ఞ

చేటికలు ఓహో! నివచో పోవుదము
(నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

## ద్వితీయాంకము

(మహారాజు పరిజనములతో ప్రవేశించును)

రాజు (స్వేచ్ఛగా నడచి)
"చేసితి జన్నముల్ ఋషివిశిష్ట
విధిన్ బహుళప్రకారముల్,
దోషికులన్ బ్రదానముల దుష్టిగ
నిచ్చితి గోచితిన్ బ్రజన్,
వీసమునైన శత్రుభయవిహ్వలతల్
గనరావు, నే నిరా
యాసముగా జరాభరత
స్వాంతమునందున శాంతి నందదన్"

మఱియు

"కంటిని సాత్మసౌఖ్యమువకం బె
బ్రజాసుఖ ముత్తమంబుగన్,
యుంటి గుణానురూప ము
మాన్యయశోధనవృత్తి చేత, నే
నుంటి స్వకర్మ పీడక మ
హోన్నతభోగము లెల్ల నంది, నే
కొంటి జనానురాగ మిక
గోరిక నేది యునర్తు వర్తిలిన్"

(ఆలోచించి)

"రాణులను మువ్వురను గూడ రంజిలంగ
జేసి రాజసుతాన్వితశ్రీ నెలంగు
రామచంద్రుని రఘువంశరత్న సదృశు
యౌవరాజ్యాభిషిక్తు జేయం దలంతు"

ఎవ రక్కడ ?

ప్రతీహారి. (ప్రవేశించి) మహారాజా! జయము ఏమాజ్ఞ ?

రాజా. విజయా! అమాత్యుఁడగు సుమంత్రుని బిలువుము

ప్రతీహారి. చిత్తము (నిష్క్రమించి సుమంత్రునితో మరల ప్రవేశించును)

ఆర్యా! ఇటు ఇటు ఇదిగో మహారాజా సమీపింపుఁడు.

సుమం. (చేరి) మహారాజా! జయము

రాజా. అమాత్యా! స్వాగతము రమ్ము కూర్చుండుము

ఇరువురు (కూర్చుందురు)

రాజా. విజయా! నీవు బొమ్ము (పరిజనులను జూచి) మీరును బోయి విశ్రాంతి నందుఁడు

పరిజనులు. చిత్తము (నిష్క్రమింతురు)

రాజా. అమాత్యా! నామనస్సు చింతాబాగ రణపరవశమై యున్నది

సుమం. (తనలో)

"భూరియశంబునుగన్న ను
హారా జిత దౌసు, రిపుభయప్రదు డయ్యున్
బౌరప్రియుఁడై చింతా
భారజ్వరుఁడౌట కేమివచ్చెనొ కట్టా!

(ప్రకాశముగా) మహారాజా!

స్థిరధర్మప్రతిముల్ ప్రజా
ప్రియ మహాదృష్టమ్ము గళ్ళత్రు శౌ
సురతిన్ గాంచిన నీకు
నెక్కడి వయా ఘోరవ్యథల్ దేవ! న
ల్వురు పుత్రుల్ వినయాన్వితుల్
ప్రజల కర్థుల్ క్షేమ పాత్రంబులై
పరగన్ మానసిక వ్యథాభరము
దేవా! యెట్లు కల్గెంగటా!

మఱియు

"కృతసంస్కారులు వినయా
న్వితులున్ జనరంజకులును విశృభక్తులునా
సుతులన్ నల్వుర గనుగొని
పిత కెల్లన్ బాయగవలె వేవేగ ప్రభూ!

వేఁక

"అవిభక్తకుటుంబికి గా
ట్లవిరళదుఃఖంబు గలుగు నటులే నీకున్
సువిశాలరాజ్య మనియెడు
నవిభక్త కుటుంబమందు నది కల్గదొకో ?"

పోనిమ్ము మహారాజా! చింతాప్రతీకార మూహింపరాదా!

రాజా. అందులకే నిన్ను బిలిచితిని

సుమం. సెలవిమ్ము

రాజా

"రైకేయీ తనయుండే
యోకైక ప్రభుత్వ గాఁగ నీవుహి కెల్లన్
సైకమువరమిచ్చితి నవి
వేకంబున దొల్లి దాన విజగందు గటా!"

సుమం. ఐన ?

రాజా

"రాజ్యపాలన యోగ్యుండు రాముఁడె యగు
తజ్ఞ త్రిభువనాకరుండైన కారణమున
యౌవరాజ్యాభిషేకంబు వతని కేను
జేయఁదలచితి సుకరంబె? ఈయది కట!"

సుమం. తమహారాజా! అది దుష్కరము గాదు

రాజా. ఎట్లు ?

సుమం.

"వినయ నయ ప్రవర్తన వివేక
గుణాదికపూర్ణుడైన రా
ముని ముగురమ్మలున్ దముదు
ముద్దులబిడ్డనిగాఁగ ప్రేమ పెం
పున గనుగొంద్రు, జ్యేష్ఠునకు
భూరిగుణంబుల దేజమందు, నా
తని కభిషేకమన్న మ్మ ముదంబును
గాంతురు రాణు లెల్లరున్"

అందుచే నీవు చింతింపవలసిన పని లేదు. ఇంతవ సుమారు లుపనీతులైరి శ్రుతి శాస్త్రాన్వయన పూర్ణులైన పిదపగదా యభిషేకము ఇప్పటినుండియు నీ కీ చింత యేల?

రాజా. పుత్ర రాజ్యాభిషేక వివాదహేతువు నిప్పటినుండి యాలోచించిన నప్పటి కేయుపాయ ముచేసైన దానిని దొలగించుకొనవచ్చునుగదా! వినఁ బొక్కొక్కప్పుడు :

"పరగ ప్రాక్పింతితం బొనుపాయమునను
భావికష్టంబు తొలఁచుకోవచ్చును గద!
వచ్చి పైబడ్డ కష్టమ్ము బాపుకొనగ
త్రోవ వెదకుట యగు ద్విధా దుఃఖకరము"

సుమం. నా కేమి యాజ్ఞ ?

రాజా

"పరిజన భృత్యమంత్రిజన పౌరజనంబులు
రాణులన్ నిరం
తరమును రామునాపయి లసారత
రామనిధేయ చిత్తులౌ
కరణి నొనర్పు, మా భరతు
గాధిత రాగ్రజభక్తియుక్తు సం
ధరితు నొనర్పు, మియ్యది సుమంత్ర!
తొలంచు మదార్త కల్పమున్

సుమం. (తనలో) ఆహా! మహారాజా దూర

దృష్టి! (ప్రకాశముగా) మహారాజా! అట్లే యొనరించెదను. నీవు సర్వము సుముఖముగను కావున నీ కొంతయు విచారింప బనిలేదు! (ముందు చూచి) మహారాజా! ముగ్గురు రాణులును బరిజనసహితముగా నిటకు వచ్చియున్నారు.

రాజా మంచిది. నీవు వెళ్లిరమ్ము నే నన్ను దేయాత్రి పేమంటకుము

సుమం: చిత్తము (నిష్క్రమించును)

రాజా రాణులు ముగ్గురు సపరివారముగా వచ్చియున్నారు. నే నీ గ్రీష్మోద్యానమున గూర్చుండి వారి వందలను రప్పించెదను (నిరూపించి) ముందు కౌసల్య

"యీ దినము త్రియంబు, మునుముందట
వచ్చిన లక్ష్మి, దివ్యకో
భాసము పేరి కోటిసు మధ్యలతా
లలితాంగి, నా దొసందలో (?)
భాసిలు మాననీయ పతిభక్త
తినూభరమున్ గడున్ క్రమా
భ్యాసమునన్ దరించునది యామె
నుపేతు రొనర్ప ధర్మమే?"

తరువాత సుమిత్ర

"వ్రత నియమాళి పరమసంధ్య
కృశాంగి, ముఖాంబుజ ప్రభా
వితత శుభాంగి, యుత్తమ వివేక
వతీమణి, నోట గట్టిగా
పలిక రొంతింగియున్ బలుక,
దర్పవిమోలిత నేత్రి, శాంతదే
వత, బహు సౌఖ్యదాయక, శుభప్రద
యామె నతింప జెల్లదే?"

ఇక కైకేయి ఆమె

"కమల వనంబు మధ్యమున
గన్పడు భానుబింబ మట్లు నె
య్యమున మెలంగుచున్ నను
సముంచిత భంగిని జూచు బూర్వమో
యము, కడ నున్న లతాగ్రమున
నాద్భుత జూడదు తా సపత్నులన్,
సమదమృగేంద్ర మధ్యలవికిం
బోక చిరికిగోదు లోకమున్"

వీరిలో

"తొలిమహిషి రామజనవియు
విలసచ్ఛుభ లక్షణాంగి విశ్రుతనయ సం
కలిత సగర్వయు నగు కో
సలరాజాత్మజయె నిత్యసమ్మాన్య యగున్"

కాని

"దురభిమాన రోషములు ముందునకు గొనదు
సర్వమిత్ర సుమిత్ర యాసత్యముగను
అత్యకామానుసారిణి యహారహంబు
నా యొడంద జయించిన వాతి యామె"

కైకేయి

"ఏ కార్యంబు సెటుంగని
యీ కాంతకు ముక్కునందు దొసగును గోపంబే కాని విక్రమాన్విత
నా కష్టము బాపి యొసుగు నాకున్ గాచెన్."

వినను

"ఈమె రోషము పరిగణియింపరావి
దగును కార్యప్రణయశీల యగుటచేత,
తెలప ఛందోనుబద్ధవృత్తంబురీతి
క్రోధముద్ర నే ప్రసాదసంసిద్ధి గూర్చు"

(అంత ముగ్గురు రాణులు పరిజనులతో ప్రవేశింతురు)

అందఱు మహారాజా! జయము

రాజా రాణులకు స్వాగతము రండు ఈ మణిఖచిత శిలాతలమున గూర్చుండుడు

అందఱు (కూర్చుందురు)

రాజా పరిజనులారా! మీరు పోయి విశ్రమింపుడు

పరి (అవ్వి) చిత్తగు మహారాజా! (నిష్క్రమింతురు)

రాజా ఆహా! గ్రీష్మకాల మధ్యాహ్నసమయమునకైన నీశీతలోద్యాన మెటు లున్నదో చూడుడు

"భువనమృగంబులెల్ల దరుపంక్తుల నీడల
గూర్కు_పట్టుకున్,
ప్రవిమలవాపికాజలచరంబులు హంసలు
కృత్రిమంబులా
పలిదివి దాచు, గోతు లిట
పాదపశాఖల జంక్రమించు, దా
పవుల గలట్టిపక్షు లిట
దారసిలున్ సుఖశైత్య మందగన్"

కాన ఈ యుద్యానవనము చూచినవారి కెల్లరికి సుఖావహమే కాని, నా కిదివఱ కిచ్చు సుఖ మిప్పుట లేదు

రాజా ఏదైనను గాలము ననుసరించియే సుఖముకాని దుఃఖముకాని కలుగును

"చన్నిటన్ స్నానము సం
పన్నము సేయని, కాని మఱి పీరున నా
పన్నము కావున గాలమె
యున్నగ సుఖదుఃఖవితతి నిచ్చు నరులకున్"

కైక ఆర్యపుత్రా! ఈకాలమున మే మేమి చేయవలయు నని నీకోరిక?

కైక. (తనలో) ఈమె మాటలు శిలాక్షరముల వలె నుండును

రాజా ఈ యుద్యానరమణీయతం దిలకింప

చేయుటకే నేను మిమ్ముటను పిలువనంపితిని. ఈచెట్టు నీడను జల్లగా గూర్చుండి సరసముగా మాటాడు కొందము

రాణులు . సంతోషము

రాజు బిడ్డల కుపనయనములు చేసితిని. పదు నైదు సంవత్సరములు వచ్చినవి

కైకే ఔను.

రాజు అందఱును గుణాశ్రయు లగుదురే

కౌస (తనలో) రాముడే సర్వగుణాకరుడు, రాజ్యయోగ్యుడు

కైకే పితృవులను బోసి దక్కువవి కాదు గాదా!

రాజు నిజమే కాని:

"స్వగుణముచే గ్రియున్
ఏతదువంశము దీపితముం బొనర్చు ట
త్యాగనితిగౌరవంబునను నారయ
బుత్రుల కట్టిదో నికన్
సుగుణము సుత్రమాన్వయము
శోభిలజేయునుగాదె పిక్కలిన్
విసుణుల బుద్ధి భారము వివేకముతో
బరికించి చూచినన్"

ఇంతకు వీరిలో నిన్నియు గలవు దేనికిని లోపము లేదు

అందుచే నందఱియందును నాకు సమానప్రేమ గలదు

కౌస: (తనలో) నాకు మాత్రమురామునిపైన్న నె క్కువప్రేమ

సుమి జన్మక్రమము ననుసరించియే నా ప్రేమ భేదము

కైకే నాకు గుణాధికునిపై నెక్కువప్రేమ

రాజు గుణాధికు డెవడు?

కౌస: (తనలో) రాముడే

కైకే అవసరమైనప్పుడు చెప్పెదను

రాజు అందఱు నా దాయభాగమున కర్హులే

సుమి దాయవస్తువులలో శ్రేష్ఠమైన యది జ్యేష్ఠునికే రావలయు నని మనువు చెప్పినాడు

కౌస (సంతోషమున దనలో) మహారాజా దాయవస్తువులలో రాజ్యమే శ్రేష్ఠము

రాజు ఆచారవిషయమున మనువు ప్రమాణము రాజధర్మవిషయమున వాసిష్ఠము ప్రమాణతమము

కైకే వాసిష్ఠ మేమనును?

కౌస (తనలో) రామునికే రాజ్య మిమ్మని

రాజు వాసిష్ఠమున నిట్లు గలదు

"ధనకనకాదికం బయిన దాయము
పుత్రులు పంచుకో దగున్;
గుణముల శ్రేష్ఠు డెవ్వ డగునో దగు
నద్దతికంబు సర్వదా,
యనుపమ సైన్యనాయకత యా
గురుకార్యనకే, నమోగురం
బున నది కాదు, రాజ్యమును బొందగ
నర్హుడు యోగ్యవర్తియే"

కైకే యోగ్యత ప్రతి పురుషుని దృష్టిని భిన్నముగా నుండును ఒకని మనసునకు యోగ్యముగా దోచునదే మఱియొకని కయోగ్యముగా దోచును

రాజు (తనలో) ఏదో వ్యాజమున నా కోరికకు విరుద్ధభావమును కైకే జూపి కార్యసిద్ధి నందుదును (ప్రకాశముగా) కుమారులు నలుగురు యోగ్యులే రాజ్యమును నాలుగు భాగములు చేసి యొక్కొక్కని కొక్కొక్క భాగ మిచ్చెదను.

కౌస (తనలో) రాజ్యమంతయు రామునికే యీదగును

కైకే ఇదియు వాసిష్ఠమతమే యగునా యేమి? ఇట్టి యనాప్తవచనమునకు ప్రమాణ మేమి? ఏక రాజ్యమే కాని సామ్రాజ్యవిభాగము పనికిరాదు

రాజు మఱి రాజ్య మెవరి కీయదగును?

కౌస (తనలో) రామునికే

కైకే యోగ్యతమునకు

రాజు (తనలో) ఇపుడే సర్వము మాటాడుదును. (ప్రకాశముగా కైకేయితో) మన వివాహ కాలమున నేను నీ కిచ్చిన వాగ్దానముమాట జ్ఞప్తి యున్నదా?

కైకే అంతయు జ్ఞప్తి యున్నది

రాజు కావున భరతుడే రాజ్యదాయార్హుడు

కైకే ఏ స్త్రీ పుత్రునకు రాజ్యలాభము కలిగిన సంతోషింపదు?

కౌస (తనలో) ఈ మాట వజ్రపాత సదృశము (మూర్ఛిల్లును)

సుమి మహారాజా! రక్షింపుము కౌసల్య మూర్ఛిల్లినది

(రాజు పైబట్టతో విసురును. కైకేయి పుష్కరిణి నుండి జలము తెచ్చి ముఖముపై జల్లును సుమిత్ర కాలుసేతులు రాయుచుండును)

సుమి: దేవి తేరుకొన్నది (కౌసల్యకు స్పృహ వచ్చును)

రాజు: దేవీ! ఏల మూర్ఛిల్లితివి?

కౌస మధ్యాహ్నవేళ యిటకు వచ్చితిని ఎండదెబ్బ తగిలినది.

రాజు: (తనలో) రాణి దుఃఖకారణము కొలము కూడ బోధపడినది

సుమిత్ర: మహారాజా! వివాహ కాలమున చేసిన ప్రతిజ్ఞ ననుసరించి భరతుడు రాజగును. జ్యేష్ఠు

దగుటవలన రాముడు రాజగును వారివురకు జేరి సగము రాజ్యమీయ దగును

రాజు: నీకొడుకుల కేమిమ్మందువు?

సుమిత్ర: నాకు నా కొడుకులకు నేమియు నక్కఱలేదు

"శ్రీరామచంద్రుడు దాశరథ రత్నవంశమున
రాజ్యమేలుచునుండ రమణ మీఱ
నేను లక్ష్మణునితో నిత్యంబు ప్రియమార
సేవజేయుచునుందు జిత్తశుద్ధి
భరతశత్రుఘ్నులు పరిపూర్ణసుఖములు
పొందుచుందురు సదానందులగుచు
రాజ్యమున్నను బరరాజభయంబును
స్వజనపాలన మహాభార మెుపను,
నది యొసంగు నిరంతర వ్యథల! క్లేశ
సమితి, జెడగొట్టు మానసశమము నదియు
నఖిలమును గాంచిచూడ మహాసుఖంబు
పరమశాంతియె, యదియె సేవాఫలమ్ము"

రాజు: కైకే: ఆహా! సుమిత్రాదేవి త్యాగము శమము లౌల్యరాహిత్యము నతిసంభావనీయములు గదా!

కౌస (తనలో) ఇంతమాత్రమున నాకు సంతోషము లేదు (ప్రకాశముగా) నా సపత్ని యెంత మహానుభావురాలు!

రాజు తల్లిగుణములు కొడుకులకు వచ్చునట ఇట్టియామె పుత్త్రులే భ్రాతృసేవావర్మభూతులగు పుత్త్రులు. వారే ధన్యులు.

సుమి నాకు గావలసిన దిదే

"మానిని గాదు మాప నభి
మానిని గాదు ప్రపంచరంగస
మ్మానిని గాదు నిత్యమృగ
మంజులవాక్ప్రతురాస్యకాదు శో
భావన గాదు ధన్య యగు
నామె సపత్నులచేత భర్తచే
మానిత కీర్తనీయ యగు
మానిని దక్కగ భూతధాత్రిలో"

రాజు ఇంతకు రాజ్యయోగ్యు డెవడు?

కైకే: నామాట పాటించుచో రాముడే రాజ్యార్హుడు

కౌస: సంతోషము. సంతోషము

సుమి నామనసున నెట్లున్నదో కైకేయియట్లే పలికినది

రాజు: వివాహకాలమున చేసిన ప్రతిజ్ఞ గతి యేమి?

కైకే: శుభగతియే.

రాజు: ప్రతిజ్ఞాహాని పాతక మనియే సంప్రదాయము.

కైకే: భవాదృశులగు రాజర్షులకు ప్రతిజ్ఞాహాని యనర్థకము కాజాలదు

ఏలన

"ప్రతిన యుపేక్షితం బయిన
పద్ధతిలో నది తప్పు, లేక యా
ప్రతిన స్వసౌఖ్యలబ్ధికయి
పాడొనరించుట తప్పు, చూడ నీ
గతులను రెండిటన్ బ్రతిన
గాంచని యట్టులు మాప ధర్మసం
గతి యగు నిక్కు, దీని కధి
కారిని నీవ, తలంపు ధర్మమున్"

కౌస (తనలో) అయ్యో! పిడుగుపాటు సంభవింపదుగదా!

రాజు యుక్తమే

కైకే

"ప్రజల సౌఖ్యంబుకోసమే ప్రతిన నీవు
దాట జాతువుకాని స్వార్థమున గాదు,
ప్రతిన తప్పుటవలన లవంబుకూడ
పాప మంటదుగద! మహాభాగ! నీకు"

మఱియు

"గుణములలోపల రాముడే గుణికరుండు
పాలనార్యుండు శతమున్యుపగిది నతడు
భువనసంరక్షణార్థమై యవతరించె
విష్ణుపగిదిని విఖ్యాతకీర్తి పతికి"

ఒక కార్యము విచారించునపుడు కారణప్రాధాన్యము నుపేక్షింపరాదు. నన్ను సంతోషపెట్టుటకై నాకుమారునికి రాజ్యదాయ మిత్తునని నీవానాడు పలికితివి. రామునికి రాజ్యదానము చేయుటవలన నేను ప్రసన్నురాలనగుదును. భరతునికి రాజ్యమిచ్చిన నెంతయో రామునికిచ్చినను నాకంతియే

రాజు భరతుడును గుణవంతుడు, రాజ్యార్హుడుగదా!

కైకే ఔను కాని:

"అనుగుణవంతునికంటె మేలగును సుగుణి
గుణుల గుణవత్తరుడు మేలు కోటిరెట్లు
భాస్వరము రాత్రి వెలుగు దీపంబుపగిది
కాని యది యెంత మధ్యాహ్నభానుముందు?"

వేరొల!

"భరతుడు గుణి యగు గుణవ
త్తరు డగు రాముండు కాన దగు నతడే రా
జ్యరమం గైకొన సుగుణా
భరణుం డతి డతని కన్న బరముడు కలడే!"

కౌస సంతోషము. సంతోషము.

సుమి ఆహా! సపత్ని కైకేయి మహానుభావయు నీతిజ్ఞయు.

రాజు: మేఘములు గర్జించినచో గాని యమృత వృష్టి గురియదు

కైకే: ఆర్యపుత్రా! ప్రణయ సమయమున నైన నిర్వ్యాజముగా నేను సత్యమే చెప్పుదును అదియే మేఘ గర్జనము అయ్యది క్షణమాత్ర మెన్నడును బలుకను. అదియే యమృతవృష్టి ఏలన

"అమృతవర్షము కురిసెడు నట్టిమేఘ
మెపుడు వర్తించు సహజమౌ వృత్తితోడ,
దానిమార్గ నిరోధంబు తనరె నేని
అతివిగూఢను వర్షించు నది నిజమ్ము"

రాజు (తనలో) అధిక ప్రసంగముచేతన మతి దొలగ భీతి కలుగుచున్నది ఈదేవి క్షణములో గోపించును క్షణములో శాంతించును కావున నిక నాకు శంక వలదు (ప్రకాశముగా)

"ప్రాప్త కాలంబునన్ రాజ్యపాలకు డగు
సుగుణవంతుడు నైన సుకుమారు, డపుడు
నియతి పాలింప దొడగును నిశ్చయముగ
సర్వసౌభాగ్యవంతుల గాగ సర్వజనుల"

కైకే: ఆర్యపుత్రా! ఇపుడు మన మనుకొన్నట్లే జరుగఁగలదు మన మట్లే తప్పక యొనరింతము

దాస: మహారాజా! సాయంతన క్రీడల కేగిన కుమారులు నలువురు జ్యేష్ఠ వరు వారు నమస్కరింప వచ్చియుందురు వారిని సంభావింప నే నేగి వచ్చెదను

సుమి: కుమారు లందరు ముగ్గురు తల్లులకు సాయంకాలము వచ్చి నమస్కరింతురు వారికి జ్యేష్ఠ, కనిష్ఠ భేదము లేదు

కైకే: ఔను నేను బోయివచ్చెదను

రాజు: మంచిది

రాణులు (రాజునకు నమస్కరించి నిష్క్రమింతురు)

రాజు:

"ముదిమి గలంగు మానసము
మోదమునందెను తీరి వర్తనన్
బదులుగ కుంత దొక్క రుచి,
వర్తిలు కిన్నరుచుల్ జనాళిలో,
పొదవును జ్యేష్ఠ కార్యసుతు
మన్నతి రక్తి, కనిష్ఠ కీర్తి శ్రియా,
రుచులు విభిన్నముల్; కలుగు
మాటికి దుఃఖము నాకు నింటిలో"

"బహు భార్యాత్వము నరునకు
బహు సౌభాగ్యకరము గాదు పరికింపంగా
బహు మానసరోగంబులు
బహురోగము కూడ నతని బట్టి వలార్చున్."

ఎవరక్కడ?

ప్రతీహారి (ప్రవేశించి) మహారాజా! జయము ఏమి సెలవు?

రాజు విజయా! సుమంత్రుని బిలువుము.

ప్రతీ (నిష్క్రమించి సుమంత్రునితో ప్రవేశించి) ఆర్యా! ఇటు ఇటు.

సుమం మహారాజా! జయము

రాజు అమాత్యా! స్వాగతము రమ్ము కూర్చుండుము విజయా! నీవు బయట కేగి కూర్చుండుము

ప్రతీ చిత్తము (నిష్క్రమించును)

సుమం: ఏమి సెలవు?

రాజు నే నిపుడు కైకేయి మహానుభావత సుమిత్ర యలోలుపత తెలిసికొంటిని

సుమం. ఎట్లు?

రాజు కైకేయి తనయునికే రాజ్య మిచ్చెదనని నా ప్రతిజ్ఞ యున్న నామె గుణవత్తరునకు రాజ్య మీయ దగునన్న న్యాయముచే రామునికే దానిని విడిచిపెట్టినది ఇక, సుమిత్ర తనయులతో రామ సేవానిమగ్నత గోరుచున్నది ఓహో మహానుభావత పర మాశ్చర్యభరితము కదా!

సుమం ఔను కాని,

"భావిన్ సౌఖ్యము గోరి మానిజనముల్
భావించి బాగోగులన్
సేవింపన్ వారంతొంద్రు న్యాయపథమున్
కొందర్యహో కష్టమున్,
దైవాయత్తము లోకమంతయును, తమున్
జంపుగా సదా దైవమే,
జీవుం డెట్టులొనర్చు దొంటి జనిలో
సిద్ధించు నట్లే జనిన్"

అందుచే

"పుత్త్రులు నల్వురున్ సుగుణపుంజము
లద్భుత వీరశేఖరుల్
గాత్రము లెన్న వేఱయిన గాని
మనస్సులు మూడ నొక్కటే
మాత్రము ప్రేమ భంగమును మాత్రము
గల్గగ నీదు రాజ్య మీ
పుత్త్రుల, కెంతవారి యసు ముల్గును
నీకుల జెల్లుపుచ్చుచో?"

కనుక, నీవు రాజ్యప్రదాన చింతను విడువుము. రాముడే రాజగును నీవు సంతోషముగా సంచరించ్చును జను లెల్లరు సంతోషింతురు. ఇక నీ కేమి కావలయును?

రాజు: నే నిపుడదే యాలోచించుచున్నాను

సుమం వసిష్ఠ భగవాను లిట్లు విన్నవించిరి.

రాజు గురుభగవాను లేమని సెలవిచ్చిరి?

సుమం. ఇట్లని, "కుమారులు.

"వేదములెల్ల నేర్చిరి వి
శేషమునన్ శుభవిద్య లెల్ల న
త్యాదరణంబునన్ వినిరి
యౌవనమందె కుశాగ్రబుద్ధిం
వేదిత శస్త్రశాస్త్రబహు
విద్యల గాంచిరి వీరి రాజనీ
త్యాదుల శాసనాదిక వి
ధాతల జేసి యనుగ్రహించెదన్"

విదూ: (ప్రవేశించి) ఓయీ! వయస్యా! ప్రతీహారులు నన్నుం నీకడ కోగా వారితో పోరాడి నీకొక ప్రియవిశేషము చెప్పుటకై యిట వచ్చిపడితిని

రాజు: ఏమి ప్రియము?

విదూ: రామునకు రాజ్యాభిషేక మగునని కౌసల్య నాకెన్నో మోదకములు పెట్టినది ఈసంగతి యంతయు నీకు నివేదించుటకై వచ్చుటవలన నా హృదయభారము మోదకభారము కూడ దగ్గిపోయినవి

రాజు: ప్రతిదినము నీవు మోదకములే తిందువు నీకే రాముడు రాజైనను భరతుడు రాజైనను నీకు మోదకములకు మాత్రము లోటు లేదు చింతింపకుము

విదూ: ఏల చింతింపను? రాముడు రాజైనచో కౌసల్యాదేవి బహుమోదకములచే నన్ను ప్రీతి చేయును భరతుడు రాజైనచో కైకేయి బహుతర మోదకములచే నన్ను సంతుష్టిని జేయును

సుమం: వసిష్ఠభగవానులతో నేమని నివేదింతును?

విదూ: (జనాంతికముగా) అమాత్యా! నేనైన చెప్పిన నావయస్యుడు కోపించును నీ కా సంగతి తెలియదు (రాజుతో) నేను మోదకములతో సంతోషింపవలయుటకు అభిషేకవిధి ప్రారంభింపరాదని వసిష్ఠునితో జెప్పెదను

రాజు: భగవానులు గురుపాదులు నగు వసిష్ఠులతో శీఘ్రమే తాము సెలవిచ్చినప్రకారము చేయుచుంటి మని నివేదించిరమ్ము

విదూ: (అపవారించి) వయస్యునకు క్షోభ కలిగింతును అంతఃపురమునుంచి నాకేమియు దెలియదు కదా! (ప్రకాశముగా) నాకు దెలియని విషయము నీవు చెప్పవు నే వచ్చుగను ఇపుడు నాకే తెలిసినది భరతున కియవలసిన రాజ్యము నా చెలికాడు రామున కిచ్చునట. నే నంతఃపురమున రాణులకు బయట భృత్యులకు పోరాటము కల్పింతును లేనిచో ప్రాయోపవేశము జేయుదు నని యందఱను భయపెట్టెదను

రాజు: అమాత్యా! నే జెప్పినది భగవానులతో జెప్పిరమ్ము

సుమం: చిత్తము (నిష్క్రమించును)

విదూ: ఈ కపట పండితుడు పోయినాడు.

రాజు: (తనలో) చపలుడగు నీవటువు కలహప్రియుడు ఆ కలహముల నెఱుంగడు ఈ మూర్ఖుడు క్షోభ కలిగించునేమో యని శంక కలుగుచున్నది కానిమ్ము (ప్రకాశముగా) సఖా! సుందరకా! ఏదో కథాప్రసంగవశమున రాజ్యదాయ విచారము కలిగినది. ఈ మాట యేమాత్రము నిజము?

అధిక విప్లవకరమైన యా నృపత్వ
మేడ? సుకుమారచేతస్కు డీమదీయ
పుత్రు డేడ? పరిహాసపూర్వక మిది
ఇందు సత్యంబు కలదని యెంచకయ్య!"

విదూ: నిత్యము మా కథాప్రసంగమే వచ్చుగాక!

(తెరలో)

"శక్రపురిన్ జయించి, సురసంఘము
ద్రోలి, వలంచి వీరరాట్
చక్రము రావణాసురుడు శాంతి
గడించియు భంగమందె ని
ర్వక్ర పరాక్రమ ప్రకృతి రామ
చరిత్రము విన్న, నా డిటన్
వక్రగతిన్ నిరూఢు డయి వచ్చి
జరింపుడు జాగరూకులై"

రాజు: (విని) ఓహో! ప్రధానపాత్రుడగు సుబుద్ధి స్వనమువలె నున్నది సుందరకా! నీవుపోయి నా వచనముగా వానితో "నీ మాట వింటిమి సంగతి తెలిసిన"దని చెప్పుము

విదూ: బాబో! నేను చెప్పిన దారిలో నేనే రాముడననుకొని యా రావణుడు నన్ను మ్రింగి వేయగలడు

రాజు: సరే నేనే చెప్పెదను (తనలో)

"ఒక కొంక నివృత్తిం బొం
దొక టుద్భూతంబు నయ్యె, ఒక దుఃఖమె నా
కకటా కొడుకులు లేమిన్,
వికలత హృదికరమ్మయి విపులు చేయు విషములన్"

ఆహా!

"సుతులు జనించినారు వర
శూరులటంచును వార్త చెంద ది
క్ప్రతి సభలో విరోధులను
దివ్యులయందును లేద కొంచి రీ
సుతు లతిబాలకుల్ కలప
కూడదు వయస్యుడు వృద్ధుడైతి నే,
నతి బలవంతు లుద్ధతు ల
హా! యవు డింక కరమ్మ దీనకే"

(నిష్క్రమించును) ఇది ద్వితీయాంకము.

# కవిసమ్మానము



శ్రీ జనమంచి రామకృష్ణ

తారాసింగ్ (వ్రాసుకునే బల్ల ముందు పెట్టుకుని వీధిలో వచ్చే పోయే జనాన్ని చూస్తూ) మిత్రులారా, నేను సుదినం ఈ వేళ ఎందుకో ఈ జీవితం అతి మధురంగా తోస్తుంది. స్వప్నాల్లో నే చూశా నా వనితని ఎంత పవిత్రమైన నామం ఎంత తీయనిది చంద్రకళ, చంద్రకళ నా స్వప్నసుందరిని గురించి సున్నితంగా సుకుమారంగా గీతమల్లాను (తలుపు చప్పుడు)

తాతయ్యా తారాసింగ్, తారాసింగ్, రన్నా !!

తారా అదేమిటల్లా ఏండి చేతులు గాలి' ఎగరేస్తూ తన్మయంలో వస్తున్నావు? తాతయ్యా ఈ వేళ ఇంత త్వరగా గాలిపోయి అర్ధరాత్రే మరి రొట్టెలు చేయవూ?

తాత మువ్వేరో కవిత్వపు కట్టలు రాసేసి పారేస్తున్నట్లున్నావే ఇంటాకా రొట్టెలు తినేందుకెవరో వచ్చారు రొట్టెలో నంజుకొందుకు పచ్చడిబద్ద లేస్తూంటే ఒకళ్ళు 'ఓ రేయి, ఆ మరికి కుబేరుడుగారు పిల్లకి పెళ్లి తలపెట్టారుట?' అంటూంటే విన్నాను ఇది నిజమేనంటావా?

తారా నిజమేనయ్యా

తాత: ఆమె అందచందాలని వర్ణిస్తూ ఎవరైతే చక్కని ఇంపైన సొంపైన కవిత్వం చెప్తారో అతని కామె నిచ్చి పెళ్లిచేస్తారుటకదూ?

తారా కాని, ఇంకో షరతుంది తాతయ్యా

తాత ఇంకో షరతా

తారా ఔను, సూర్యాస్తమయం అయే లోపుగా గీతాన్ని పూర్తి చెయ్యాలి

తాత ఓస్, ఇంతేనా, తప్పకుండాను ఇంకో ఓ ఘంటసేపు నాకు తీరుబడే నాలుగు పంక్తుల్లో అద్భుతంగా ఓ గీతాన్ని వ్రాసేస్తాను తారాసింగ్, ఓ మాటు మార్చేదికి ఓ ఘంటలో, రకరకాలైన రొట్టెలు తయారు చేసి ఇచ్చాను అటువంటప్పుడు ఈ గీతం వ్రాయడం ఎంత సేపు చెప్పు? సరే కాని ఒక్క గేయం వ్రాస్తే సరిపోతుందా, లేకపోతే ఇంకా గీతానికి సంబంధించిన షరతులేమన్నా ఉన్నాయా?

తారా కంచాలి వజ్రవైఢూర్యాలని పోదిగి ఎంత బాగా నాజూకైన ఆభరణాన్ని చేస్తాడో అమో స్తుతగానే, గేయంలో ఆమె పవిత్రనామాన్ని ఇమిడ్చి పొందికగా వ్రాయాలి

తాత ఓహో, రొట్టెలపిండితో రొట్టె చుట్టూరా ఆకులూ పువ్వులూ అమర్చినట్లు అంతేనా

అరే తారాసింగ్, లోపల్నించి అప్పుడే ఏమిటి, కవిత్వం ఉబుకి పైకొస్తున్నట్లుగా ఉంది

తారా సరే కాని, తాతయ్యా, ఆ గేయాన్ని సుట్టుకు చక్కని దస్తూరీలో వ్రాయాలి

తాత పెద్ద ఇబ్బంది తెచ్చిపెట్టావే మరి నాకు కలం పట్టటం రాదు రొట్టెలపిండి ముద్దముంటావా, నీ ఇష్టం వచ్చినంత సుళువుగా వయ్యారంగా గాత్రాన్ని

తారా తాతయ్యా, ఎందుకంత వెంగలో తాపు చేస్తున్నావుగా

తాత వట్టిపుణ్యానికి వ్రాయక్కర్లేదులే!

తారా ఒక్క దీనారం వ్రాయడం కంటు నాకొదిలెయ్యకనోయి నీ గేయాన్ని చూసి, ప్రపంచా, అబ్బా, చంద్రకళ, తప్పకుండా తాతయ్యా నే ప్రేమిస్తుంది అని ఈర్ష్యపడాలి

తాత సరే, ఇదిగో ఇంత బాగేయంగురించి ఆలోచించాలి ఉండు ఆలోచిస్తాను. ఇదిగో, ఆమె దీపం, నేను మిడత అని ఆమెతో చెప్తాను తారాసింగ్, నాకు మతిపోతూంది ఖానాలు ఊరికే పడగొట్టుకుంటూ వచ్చేస్తున్నాయి నేను దీపాన్ని ఆమె నాచుట్టూ తిరిగే మిడతా కాదు కాదు.

మొదట ఎట్లా చెప్పాను తారాసింగ్ ? (తలుపు చప్పుడు)

తారా ఎవరు వారు ?

ఫరీద్ (అడుగుల చప్పుడులో దూరా న్నుంచే) నేను, ఫరీదుని

తారా ఓహో హో ఫరీదుగారా రండి, రండి, దయచేయండి, ఏమిటీ వేళ ఇలా దయచేశారు

ఫరీద్ ఏముందండి ? ఇంతదూరం వచ్చాను కదా అని ఓమాటు చూసిపోదామని (లోపలనుండి మూల్గులువిని) అరే, ఎవరండీ అలా మూల్గుతున్నారు ? ఏం పాపం, ఒంట్లో బాగులేదా ? ఏమిటి ఆయన బాధ ?

తారా ఎరగరూ అతణ్ణి తాతబ్బాయి ఈ పక్కకొట్టులో రొట్టెలు చేసి అమ్ముతాడు

ఫరీద్ నే సెరగను లెండి ఔను కాని ఎందు కండి ఆయన ఘడీకోమాటు తలకాయ చేతితో కొట్టు కుంటాడు ? ఘడీకోమాటు గొంతు చేతులూ పైకెత్తి రాగం తీస్తున్నాడు కొద్దిగా మతి చెడిందా ? పాపం, చిన్నవాడేనండీ

తారా (నవ్వుతూ) అబ్బే అతను కవితా వాహినిలో ఈత నేర్చుకుంటున్నాడు

ఫరీద్ ఏమిటేమిటి ? రొట్టెలమ్ముకునేవానికి, కవితావ్యాధయా ? తారాసింగ్ ! చంద్రకళని వశంచేసుకునే నేర్పుతో, నిజంగా కవిత్వం అల్లగల డంటావా ? (దూరాన్నుంచి) అబ్బబ్బా, ఏమిటా గోల నేను కవిత్వం ఆలోచిస్తూ న్నట్లు తెలి యుడూ ఎవరు ? ఓహో మీరా ? ఫరీదుగారూ ! ఎంతకాలానికి మళ్లా కనిపించారు సాయబుగారూ, ఎప్పుడో తిన్న చిమ్మిలికొట్టికి డబ్బు లిచ్చారు కాక (పాడును) "లోన మధుకీలలేపిన దీప మీవు"

ఫరీద్ తారాసింగ్, తను తయారుచేసే రొట్టెల్లాగే వుంటుంది సుమా ! ఇతని కవిత్వం (నవ్వు) ఔనుకాని, నీతో ఓ విషయం మాట్లాడుదామని వచ్చాను ఏమిటి, అది నిజమేనా ఆఖరికి కుకు రుడుగారు చంద్రకళని

తారా ఔనయ్యా, ఏం నీకు, ఆ పిల్లమీద కన్నుపడిందా ? ఈ కానియ్యి మహత్యా మొద లెట్టు కవిత్వం

ఫరీద్ కుకేటుకుగారికి చదవడం రాదు గదా మరలెందుకోయి కూతురికి చదవటం నేర్పా నని, తండ్రి కెంత గర్వం అనుకున్నావ్

తారా ఔనౌను ఆమె చంద్రకళ కాదు విద్యాసుందరి చదువుల సరస్వతి

ఫరీద్ ఔను తారాసింగ్, చంద్రకళ సామా న్యురాలు కాదు నాపాట వ్రాసిచ్చేటందుకు ఎంత పుచ్చుకుంటావు ?

తారా ఎంతో నా, రెండు దీనారాలు .

ఫరీద్ రెండా ? ఒకటందూ, నేనుగాని చంద్రకళని సంపాదించావా, నా డబ్బంతా నీదే

తారా సరేలే

తారి (దూరాన్నుంచి) తారాసింగ్, తారా సింగ్, నాకు కవిత్వం రావడం లేదు ఒక పాదం వచ్చింది రెండోది ఎలాగ ?

ఫరీద్ తెలికైందా ? మరుగ్గా మజాగా ఉండాలా ? లేకపోతే, హుందాగా ఉండాలా ?

తారి తారాసింగ్ రెండో చరణం ఎలాగ ?

ఫరీద్ తారాసింగ్, వీణ్ణి ఇక్కణ్ణించి లేవ గొడితేనే కాని, నాకు భావాలు రావు ఆ మొహం చూడు పైగా గద్యంలో పద్యం వ్రాయడానికి పాహానిస్తున్నాడు

తారా ఫరీదుగారూ ! పోనీ మీకు ఎక్కడ కూర్చోవాలని ఉందో చెప్పండి.

ఫరీద్ ఎక్కడో అక్కడ, కాస్త మెత్తగా ఉండాలి ఇక్కడ మఖ్‌మల్ పరుపులూ గాలీ సులూ లేవే ఎలాగ కవిత్వం వ్రాయడం ?

తారా పోనీ అక్కడ కూర్చోండి !

ఫరీద్ (దూరాన్నుంచి) ఆఁ అమ్మయ్య. కాస్త బాగుంది. తారాసింగ్, ఇదిగో ఇప్పుడే చెప్తు న్నాను ఎవరొచ్చినా సరే, నా దగ్గిరకిమాత్రం రానీ యొద్దు నా బుర్ర ఉండే, కాస్త నా గొడవ ఓర్పులో లేదు అంత సుకుమారమైంది కాస్త కరుకుమాట విన్నానంటే, మనస్సు చిట్లుకుంటుంది పాడు మొహం కనిపిస్తే చాలు ఓ వారంవరకూ మతి చెడి పక్కైపోతాను

తారా : సరేనయ్యా బాబూ .

ఫరీద్: ఐతే మరి నేను కవిత్వంలోకి దిగిపోతాను.

(కొంతసేపు చప్పుడు తర్వాత అడుగుల చప్పుడు)

అప్పలస్వామి: (కత్తిరి చప్పుడు చేసుకుంటూ దూరాన్నుంచే) తారాసింగ్ మనవాడు మొత్తానికి కాబురికి పెళ్ళి తలపెట్టాడే చంద్రకళ, చంద్రకళ, రారాజులు పెళ్లి చేసుకోతగ్గ సౌందర్యవతి

తారా అరే, అప్పలసామి, ఆ కత్తిర్ని ఇటూ అటూ తిప్పకు నా కంట్లో గుచ్చుకోగలదు

అప్పల నా కంతా స్వప్నంలా ఉంది చిన్నప్పుడు నేను పెళ్లిళ్లలో గనిసెట్టు మేళం ముందు గంతేవాణ్ణి. ఇప్పుడా విధంగా గంతాలని ఉంది తారాసింగ్ ఇదిగో నేను ముందే బజానా ఇచ్చేస్తున్నాను ఆమెనే నేను పెళ్లాడానంటే ఈ మంగలి వృత్తి మానేశానన్నమాటే. అను, (కత్తిరి చప్పుడు) నా పద్యం నేను వ్రాసేస్తాను అప్పుడు నేను చెప్పుకుంటే, నువ్వు కలం పట్టుకు గబగబా వ్రాసేయాలి

భావకవి (దూరాన్నుంచి) గాడిదా, బుద్ధి లేదూ, ఈ లోపలరా, దాక్కున్నావు? తారాసింగ్ తారాసింగ్, మంగలి అప్పలసామి లోపలున్నాడా?

అప్పల తారాసింగ్, ఎవరా కేక వేసేది? ఓహో, అరెరె, ఆయన గడ్డం చేస్తూ చేస్తూ వచ్చేశాననుకుంటాను

భావకవి (కోపంగా) తారాసింగ్, వాడు లోపల ఉన్నాడా? చూడు, గడ్డం నిండా ఎట్లా నాట్లు పెట్టాడో పైగా ఓ చంప అట్లానే ఉంచేసి చంద్రకళ మాట వినగానే పరుగెత్తాడు ఏడీ వాడు? కనిపించడే ఏం చేస్తానో చూడు

తారా కొంచెం శాంతించాలి యువకవి గారూ! అత నెప్పుడైనా ఆ విధంగా మిమ్మల్ని సగం సగం గడ్డం చేస్తూ, వదిలేశాడా? అప్పల స్వామి పద్యం వ్రాసే ధోరణిలో ఉన్నాడు అంతే.

భావ పద్యమూ, ఏమిటి? నా కన్పిస్తే బ్రహ్మ రామకీర్తన పాడిస్తాను

ఫరీద్ (దూరాన్నుంచి) తారాసింగ్ ఆ యువకవిగారిని అవతలికి దయ చెయ్యమను కవిత్వం ఆలోచిస్తున్నానని తెలియదూ? పాడు గొడవ

తార అబ్బబ్బా, ఇందాకటినుంచీ ఓ మాట కోసం గింజుకుంటూంటే ఆఖరికి మనస్సుకి తట్టింది కాని, ఆ మాట కాస్తా ఈ పాడు గొడవలో మళ్లీ మాయమైపోయింది.

అప్పల (గట్టిగా) ఆయ్యా యువకవి గారూ, మరోమాటు, ఆ రెండో చెంప గీసేస్తాను లెండి ఇప్పుడు కాదు చాలా కవిత్వం తొందరలో ఉన్నాను దయచేయండి

తారా యువకవిగారూ, కుబేరుడిగారి సంగతి విన్నారా? ఒక పద్యం చంద్రకళమీద వ్రాశారా, చంద్రకళ మీ జీవితాన్ని కాంతిమంతం చేస్తుంది

భావ ఏమిటి, ఒక్క పద్యం వ్రాస్తే చాలా? చెప్పావుకాదు? అదెంతసేపు

తారా మీ పద్యం చక్కని దస్తూరీతో అచ్చులా ఉండాలి

భావ నా వ్రాత అంత బాగా ఉండదే?

తారా నేనున్నానుగా? ఏమిటి సెలవు?

భావ వ్రాసేందుకు ఎంత పుచ్చుకుంటావు?

తారా ఎంతోనా, ఒక దీనారం

భావ అబ్బే, అంత ఇచ్చుకోలేనయ్యా

తారా మీరే అలాగంటే ఎట్లా? ఉత్తమమైన పద్యానికి అంత మొత్తమైనా ఇచ్చించకపోతే బావుండదు

భావ సరే, ఇదిగో

ఫరీద్ అమ్మయ్యా, కాస్తగొడవ తగ్గింది కాని ప్రాస కుదరడంలేదు కళకుతగిన పదాలు ఆఁ వస్తోంది పెళ, తళ, గళ, బళా, యుత ప్రాసలుంటే చాలుగా, అర్థం లేకపోతే పోయే ధ్వనికి, ప్రాధాన్యం ఇచ్చారు కాని అర్థానికాదుగా బాగుంది

భావ (మూరాన్నుంచి) – ఏయ్, అత్తరు పాయిబూ, వాగకు మంచిభావంకోసం కలంచేస్తున్న సమయానికి ఎందుకా గార్దభస్వరంతో అరుస్తావు? లోపల ఆలోచించుకోలేవూ?

ఫరీద్ మనస్సులో ఆలోచించుకోడం నాకు చేతకాదు

అప్పల (ఓమూలనుంచి) స్, స్, నిశ్శబ్దంగా ఉండలేరూ, భావకవిగారూ మనస్సులో అప్పుడే నా పద్యం పూర్తిచేసేశాను. కంఠతా వడుతూంటే కాస్త మాట్లాడకుండా ఉండలేరూ?

తార (పిట్టలనుంచి) మీ కంఠ మాట్లాడు కోవాలని ఉంటే, దూరంగాపోయి మాట్లాడుకోండి బాబూ.

ఫరీద్ (కోకిల కూలా బులాలా వరసని) బాలాలా (అని తానిరాగం తీసి) కోయిలలా గొంతు లోన కోర్కెలు రేగనటే,

తేద్ ఇలా మొదలెడితే ఎలావుంటుందో

తార ఆc వచ్చింది, వచ్చింది, అమ్మయ్య

(రాగంతో) కాముడి కాంతి లోగొన్న కోకిలమ్మ, గళము సరిచేసి ఫెళ ఫెళా పాడుమమ్మ

ఫరీద్ (కోపంతో) ఏమిటంటున్నావు తారా బ్బాయి! ఉహు, నేనుమాత్రం ఒప్పుకోను మొదట నాకొచ్చిందా భావం, కోకిల నా మనస్సుకి మొదట తట్టింది

తార అమ్మయ్య, ఇందాకటినుంచీ అంత బాగా పాడే పక్షి పేరు జ్ఞాపకంరాక గిలగిల కొట్టుకున్నాను

(రాగంతో) కోకిలా, కోకిలా, కూయవే, కూయవే

ఫరీద్ (చికాకుతో కోపంగా) అంత దొంగలు నా ఎంగిలి తింటారే మీరు బుర్రల్లేవూ?

తారా ఏమిటిది ఫరీద్? కవులూ, ప్రియులూ, మీరే, ఇలా దెబ్బలాడుకుంటే ఎలా? ఈ గొంతెండి పోయిన ప్రపంచానికి మీరు, భూర్భువస్సువర్లోకాల అమృతాన్ని చిలుకుతున్నారు వద్దు దెబ్బలాడకోకండి

అప్పల అంతా వినండి వినండి నా గద్యం పూర్తైపోయింది వినండి

ఫరీద్ వినం, వినం, వినం ఈ కోకిలగురించి ముట్టమొదట ఇటో అటో తేలాలి

అప్ప తారాసింగ్, నేను మర్చిపోకముందే నాగేయం చెప్పేస్తాను త్వరగా వ్రాసేయి బాబు!

(పాడును) రోజా రేకుల చుబుకముదానా,
శ్యామలనీరద ఆకాశంలో
కోకిలగానము చేయవదేమి

ఫరీద్ (అడ్డంగా వచ్చి) అప్పలసామీ, ఏ తే, నీ మనస్సుకి కోకిలే పట్టిందన్నమాట ఇన్నాళ్ళూ ఈ ప్రపంచంలో డబ్బుకోసమే దోపిళ్లు జరుగుతున్నా యనుకున్నాను ఆఖరికి భావాలనికూడా దొంగిలిస్తున్నారు ఇంకెక్కడ దాచుకోడం

అప్పల ఏమిటంటున్నావు? కోకిలా? కాదు నాకే మొట్టమొదట మనస్సుకి తట్టింది. ఎంతచక్కని మాట కోకిల! కోకిల!

ఫరీద్ నేనా, పుట్టమొదట అటువంటి పక్షి ఉందంటూ కనిపెట్టినవాణ్ణి

తార (నవ్వుతూ) పక్షి ఏమి టోయ్, ఫరీదు?

ఫరీద్ కాదు పక్షి, పిట్ట కలిస్తే పక్షౌతుంది నేనే కనిపెట్టాను

భావ మీ చివరిదీ కాదు నాది

తారా కవులారా, మీరందరూ ఒక పక్షి గురించి ఈ విధంగా తగాదాపడి కాలయాపన చేస్తున్నారు చంద్రికా ఒక్కటే ఏనా, ప్రతి వనం, పున్నెల కౌగిలింతలో పులకరించడం లేదా? అందరూ ప్రేమ వ్యాకులై ప్రేమ జపమాలని తిప్పడం లేదూ?

అప్పల బాగా చెప్పావు తారాసింగ్ కోకిల అన్నమాట నా స్వంతం కాదు కాబట్టి, మిగతా వారు వాడుకోడానికి ఎటువంటి అభ్యంతరం పెట్టను

ఫరీద్ నేనుమాత్రం ఒప్పుకోను ఇదిగో, ఇప్పుడే చెప్పేస్తున్నాను కోకిలని ఎవ్వరూ కవిత్వంలో వాడ్డానికి వీలులేదు మీ కందరికీ తెలుసున్నదే పునరుక్తి దోషంబు పొంత పోకండి.

అప్ప తారాసింగ్, ఇప్పట్లో నా తగువు తీరేట్లా కనిపించడం లేదు ఈ విషయంలో నీకు ప్రమేయం లేదు కాబట్టి, నువ్వు ఎలాగో, అలాగ, ఇదమిద్ధం అని పరిష్కారం చెయ్యి

తార ఔను, అప్పలసామి చెప్పింది బాగుంది తారాసింగ్, నువ్వు చెప్పవయ్యా

భావ నాకు ఇష్టమే

ఫరీద్ సరే, అందరికీ ఇష్టమైతే నాకూ ఇష్టమే

తారా కవులారా, ఇందులో నేను పరిష్కారం చెయ్యతగినదేముంది? మీరంతా మీ మీ గేయాలు ఎట్లా వ్రాసినా సరే, అవిమాత్రం అమరత్వాన్ని పొందాలి. పరిమళ భరితంగా ఉండాలి మీ ఇష్టమొచ్చినన్ని పక్షుల్ని వాడండి, కొనుక్కో

చిలుకలు, పావురాలు, ఆ కోకిలమ మాత్రం తరిమేశాం. ఏం? తీరిందా తగవు!

ఫరీద్ ఏమిటి? ఆ కోకిలని ఎవ్వరం వాసి చూసేదూ? విసే చాలా కష్టమే!

## దృశ్యం 2

(తారాసింగ్ గదిలోనే కవులంతా కూని రాగాలు తీస్తూ ఆలోచనల్లో మునిగి తేలుతూం టారు)

అప్ప (ఆకస్మికంగా) వచ్చేసింది, దల్బానీ, తారాసింగ్ కాగితం కలం తెచ్చుకో అబ్బబ్బా, భావాలు జలపాతాల్లో పడిపోతున్నాయి ఒక్క నిమిషం కాలయాపన అయిందా భావాలు జారి పాతాళంలో ఇరుక్కుపోతాయి

తారా అప్పలస్వామి, నేను సిద్ధమే నా స్వామీ, కానీ చెప్పు

అప్ప (పాడుతూ)

ప్రణయ తూలిక విసురులో విరిసినట్టి
విరులహారమ్ము కానీయ, నీ వందుకొమ్ము

అబ్బే కాదు, కాదు

"కళల కాణాచి, చంద్రికలు" చ్, చ మర్చిపోయాను

తాత (అతి తొందరగా) అద్భుతము భళా, భళీ, దప్పిక, గతేశాల నూని కాగిపోతూన్నట్లు నా మెదడు ఈ ఆలోచనలతో మరిగిపోతూంది తారాసింగ్, కలం తెచ్చుకున్నావా? ఏమిటూ ప్రాస? కళ బళ

అప్ప తారాసింగ్, తప్పనండి, బాబ్బాబు, ఒక్కసారి రావూ?

తారా అప్పలస్వామి, నాకేం నాలుగు చేతులు లేవు? ఇక్కడ తాతయ్యాయికే వ్రాయనా, అక్కడికొచ్చి నీకు వ్రాయనా, కాస్సేపుండు

భావ (దూరంగా పాడుతూ)

చిరునవ్వాయమునా డే
చిరుకేలు సాచుమా

ఫరీద్ తారాసింగ్, వాళ్లంతా దొంగలు, వా, బాబు, వ్రాసేయి

అప్పల (పాడుతూ) "పత్రికల సందులందు పొంచియున్న" — వ్రాసుకో తారాసింగ్

ఫరీద్ (తన గులాబీలలో, తకధిమి లాలా అంటూ పాడుతూ)

కంటిచేతా లేక
కవితా పాడూనేలో

భావ (పాడుతూ) చిరునవ్వాయమునాడే,

చిరుకేలు సాచుతూ,
చీమ చిటుకన గానె
చేజారిపోతివా ?,

తాత (పాడుతూ)

కాంతిలోకములకనగా నె
గళమునెత్తి, కకకకొయని
కేకలేడ్చినాను

తారా (నవ్వుతూ) నామీద పడికండి కవిత్వజ్వాలలు ఎగిరి నాకు ముచ్చెమటలు పోస్తు న్నాయి ఒకళ్ల తర్వాత ఒకళ్లు అప్పలస్వామి! ఏదీ నీ గేయం చెప్పు

అప్ప: (పాడుతూ)

కళల కాణాచియైన కౌముదీ కళిక
ప్రణయ తూలిక చివర
ప్రసవించె పూమాల
ప్రణయినీ, ప్రణయినీ గళమునే, ప్రణయినీ.

తారా భేష్, ఎంత బావుందయ్యా, ఈ పద్యం నాదైతేనా ?

ఫరీద్ బావుందా, హా, నాకంతా బ్రలు ముకుగా ఉంది

అప్పల ఏమిటంటున్నావు? నా గ్రంథ పాయిలా?

తారా తాతయ్యాయి, ఏదీ ఓమాటు మాత ఎత్తు, ఎటువంటి సువాసనద్రవ్యాలు వేసి పకార్ల రొట్టెని తయారుచేశావో చూస్తాను?

తాత (పాడుతూ)

పవలు రేయనుమాటల మరచిపోయి,
చేతిలో నానిపోగిన పిండి ఖాతి
గుండెపై దబదబా బాదు కొంటి ఫకియా!

తారా భేష్, తాతయ్యాయి, భేష్ యాదుకరే, ఏదీ నీ వంతవరకూ వచ్చింది చెప్పు మరి వ్రాసే స్తాను

